గతంలోని నల్గొండ జిల్లా నుంచి యాదాద్రి జిల్లా విడదీయబడింది.పశ్చిమ చాళుక్యుడు త్రిభువనమల్ల విక్రమాదిత్య-VI ఇక్కడ వివిక్త శిల మీద ఓ కోటను నిర్మించారు. అందుకే దీనిని త్రిభువనగిరిగా పిలుస్తారు. తరువాత భువనగిరి మరియు భోంగిర్ గా మారింది. అంతేకాదు ఈ కోటను కాకతీయ రాణి రుద్రమదేవి మరియు ఆమె మనవడు ప్రతాపరుద్రుడు పాలనతో ముడిపడి ఉందని కథనం. అనంతరం 1910వ సంవత్సరంలో నగర మున్సిపాలిటీగా ఏర్పాటైంది.

పూర్వం భువనగిరి, యాదగిరి గుట్ట అనే రెండు వేర్వేరు మండలాలు ఉండేవి. అయితే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తరువాత చిన్న జీయర్ స్వామి సూచనలతో యాదగిరి గుట్టను యాదాద్రిగా మార్చారు. అంతేకాకుండా రాష్ట్రంలో పేరుగాంచిన ఆధ్యాత్మిక క్షేత్రం యాదాద్రి పేరిట జిల్లాకు యాదాద్రిగా నామకరణం చేశారు.

యాదాద్రి జిల్లా 1,193.63 చదరపు మైళ్ల వైశాల్యంలో విస్తరించి ఉంది. సూర్యాపేట, నల్గొండ, జనగాం, సిద్దిపేట, మేడ్చల్ మల్కాజిగిరి, రంగారెడ్డి జిల్లాలతో సరిహద్దును పంచుకుంటుంది. అదేవిధంగా నల్గొండ జిల్లా ప్రధాన కార్యాలయం నుంచి సుమారు 67 కిలోమీటర్ల దూరంలో,రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నుంచి 48 కిలోమీటర్ల దూరంలో ఉంది.

జిల్లాలో ఆలేరు, అడ్డగూడూర్, ఆత్మకూర్ (ఎం), బీబీ నగర్, భువనగిరి, బొమ్మల రామారం, మూటకొండూరు, మోతుకూరు, తుర్కపల్లి, యాదగిరి గుట్ట, రాజాపేట, గుండాల, (బి) పోచంపల్లి, చౌటుప్పల్, సంస్థాన్ నారాయణపూర్, రామన్నపేట్ మరియు వలిగొండ అనే 17 మండలాలు ఉన్నాయి. జిల్లా పరిపాలన కేంద్రంగా భువనగిరి ఉండగా.. చౌటుప్పల్ మరియు భువనగిరి అనే రెండు రెవెన్యూ డివిజన్లు ఉన్నాయి.

భువనగిరి, యాదగిరిగుట్ట, ఆలేరు, మోత్కుర్, భూదాన్ పోచంపల్లి మరియు చౌటుప్పల్ గా ఆరు పురపాలక సంఘాలు ఉన్నాయి. 2011 జనాభా లెక్కల ప్రకారం ఈ జిల్లలో మొత్తం 421 గ్రామ పంచాయతీలు ఉన్నాయి. జిల్లాలో 2011 లో జనాభా 770,833 మంది ప్రజలు నివసిస్తున్నారు. ఈ ప్రజలలో 3,90,492 మంది పురుషులు మరియు 3,80,341 మంది మహిళలు ఉన్నారు.

2011 లో జిల్లాలో తెలుగు మాట్లాడే ప్రజల శాతం 90.54, లంబాడీ భాషను మాట్లాడేవారు 4.97, ఉర్దూను 3.42 శాతం ఉన్నారు.

-యాదాద్రి పరిశ్రమల స్వర్గధామంగా నిలుస్తుందని చెప్పొచ్చు. జిల్లా వ్యాప్తంగా సుమారు ఐదు వందలకు పైగా భారీ, మధ్య, చిన్న తరహా పరిశ్రమలు ఉన్నాయి. దండుమల్కాపురంలో ఎంఎస్ఈ గ్రీన్ ఇండస్ట్రియల్ పార్క్ తో పాటు భువనగిరిలో గాజు పరిశ్రమ, బీబీనగర్ లో సిరామిక్ సంస్థ, చౌటుప్పల్ మండలంలో దివీస్, శ్రీని వంటి ఫార్మా కంపెనీలు ఉన్నాయి.

పోచంపల్లిలో చేనేత కళాకారులు నేసే చేనేత కళాఖండాలకు ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు ఉంది. 1970 నుంచి పట్టు చీరల తయారీ ప్రారంభంకాగా, పోచంపల్లిలో మొదట నూలు చీరలు నేసేవారు అని తెలుస్తోంది. ఈ ప్రాంతంలో కొండా లక్ష్మణ్ బాపూజీ చొరవతో చేనేత పరిశ్రమ పోచంపల్లికే పరిమితం కాకుండా, చౌటుప్పల్, కొయ్యలగూడెం, పుట్టపాక, గట్టుప్పల్, సిరిపురం, ఎల్లంకి, రామన్నపేట, బోగారాం, మరియు నాగారం గ్రామాలకు విస్తరించింది.

యాదగిరి గుట్టలో గ్రీన్ సిగ్నల్ మెడికల్ కాలేజీ ఏర్పాటు చేసింది. డిప్లొమా, డిగ్రీ, ఇంజనీరింగ్, పీజీ విద్య అభ్యసించేందుకు ప్రతిష్ఠిత కాలేజీలు ఉన్నాయి. గవర్నమెంట్ డిగ్రీ కాలేజీలు, లుంబినీ గ్రూప్ ఆఫ్ ఇన్స్టిట్యూట్, వాత్సల్య ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ, శ్రీ శారద ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ టెక్నాలజీ కాలేజీలు ప్రముఖమైనవి.

-యాదాద్రి జిల్లా పోచంపల్లి మండలంలో కృష్ణానదికి ఉపనదిగా ఉన్న మూసీ నది ప్రవహిస్తుంది.బోలేపల్లి -చౌటుప్పల్ వద్ద ఈ నదిపై వంతెన ఉంది.

-కాళేశ్వరం ప్రాజెక్టు జలాలు జిల్లాను సస్యశ్యామలం చేస్తుంది. బస్వాపూర్ (నృసింహ సాగర్) రిజర్వాయర్ ద్వారా యాదగిరిగుట్టకు గోదావరి జలాలు చేరుకుంటున్నాయి. తుర్కపల్లి, బొమ్మలరామారం మండలంలోని ఆయకట్టుకు

కొండపోచమ్మ సాగర్ జలాలు ఉన్నాయి. భువనగిరి నియోజకవర్గంలోని సూరేపల్లి తండా, ఏదుల్లగూడెం తండా, పచ్చర్లబోడు తండాలలో లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా పంటపొలాలకు నీరు అందుతోంది. యాదాద్రి - భోంగిర్ లో సుమారు 28 ఎకరాలకు సాగునీరు పైప్ లైన్ పనులు ప్రారంభం అయ్యాయి.

ప్రస్తుతం జిల్లాలో అధికార పార్టీ బీఆర్ఎస్ తో పాటు కాంగ్రెస్ పార్టీ ప్రాబల్యం ఎక్కువగా ఉంది. అలాగే ఆలేరు, భువనగిరి అసెంబ్లీ నియోజకవర్గాలతో పాటు భువనగిరి లోక్ సభ నియోజకవర్గం ఉంది. భువనగిరి ఎంపీగా కాంగ్రెస్ పార్టీకి చెందిన కోమటిరెడ్డి వెంకట్ రెడ్డి వ్యవహరిస్తున్నారు.అదేవిధంగా  రాజకీయ నేతలు రావినారాయణ రెడ్డి, అలిమినేటి మాధవరెడ్డి., తెలంగాణ కళా సమితి వ్యవస్థాపకురాలు బెల్లి లలిత, సినీ నటి ప్రత్యూషలు జిల్లాకు చెందిన వ్యక్తులు కావడం విశేషం.

జిల్లాలో పలు ఆలయాలు ఉన్నాయి, శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దేవాలయం, కొలనుపాక జైనమందిరం, సురేంద్రపురి హనుమదేశ్వర దేవాలయం, ఈ ఆలయాలలో కొలనుపాక జైనమందిరంలో పిలువబడే ఆదినాథుని మూల విగ్రహం నిలయంగా మార్చిందని కథనం. ఇక్కడ అనేక దేవాలయాలు ఉన్నాయి, బ్రహ్మ, విష్ణు లోకాలు కళ్లకు కట్టినట్లు దర్శనమిస్తాయి.

భువనగిరి కోట.. తెలంగాణ చరిత్రకు నిలువెత్తు నిదర్శనంగా నిలిచే ఈ కోట సుమారు మూడు వేల సంవత్సరాల క్రితం నాటిది. అనేక అద్భుత కట్టడాలకు నిలయం. 40 వేల ఎకరాల విస్తీర్ణంలో నిర్మించబడిన ఈ కోట లోపల భూగర్భ గదులు, పొడపైన కారిడార్లు ఉన్నాయి. కోట పై భాగంలో నీటి అవసరాలకు రెండు చెరువులతో పాటు కొన్ని లోతైన బావులున్నాయి.

జిల్లాలో ఉన్న యాదాద్రి ఆలయానికి అంతర్జాతీయ అవార్డ్ అయిన ఇంటర్నేషనల్ బ్యూటిఫుల్ బిల్డింగ్స్ గ్రీన్ యాపిల్ అవార్డు లభించింది.

అభివృద్ధి పథంలో దూసుకెళ్తున్న యాదాద్రి భువనగిరి జిల్లా అన్ని రంగాల్లో విజయవంతంగా మరింతగా రాణించాలని తెలుగు.న్యూస్ ఆకాంక్షిస్తుంది.